శ్రీరస్తు

# పీఠిక

---

మిత్రులారా!

పరబ్రహ్మస్వరూపుడగు శ్రీరామమూర్తి దివ్యచరిత్రమును వాల్మీకి మహాముని లోకమున నవతరింపజేసి పెక్కండ్రనుతరింపజేసెను. అదియాంధ్రీకరించి భాస్కరుడు మొదలగు తెలుగుకవులు మనయాంధ్రలోకమును పావనముచేసిరి. కాని పైవారుచేసిన గ్రంథములన్నియు పండిత భాషయందు వ్రాయబడి యుండుటవలన వానిసారము సామాన్యజనులకు గట్టుచాటు నిక్షేపముగా నున్నది. పరమపవిత్రమగు రామకథ సుబోధముగ పామరులకు సయితము తెలియజేయు సంగీతరచన చిరకాలమునుండి మనదేశమునకు కావలసియుండుటచూచి పెక్కండ్రచే వ్రాయబడిన కీర్తనలు కొన్నియును మాచే వ్రాయబడిన కీర్తనలు కొన్నియును కథాసరళిగా చిరకాలమునుండికూర్చి లోకోపకారము కొరకు యీగ్రంథమును రాజమండ్రినివాసులగు మాదేటి సన్యాసయ్యగారివలన ముద్రించియున్నాము. యీకీర్తనలు మిక్కిలి సులభశైలిని యుండుటయేగాక అడుగువరుస నాట్యముచే రామభజన చేయువారికిగూడ మిక్కిలి యుపయోగకరముగా నున్నవి. ఏ రీతినైనను రామనామమును స్మరించుటయు రామచరిత్రమును పఠించుటయు సంసారసాగరతరణమునకు సాధనములుగనుక సామాన్యులందరకు యట్టిసౌకర్యమును కలుగజేయుటకు తగిన యీకీర్తనలయందు స్వల్పమయినదోషము లేవియైనను కనుపించిన నీళ్ళను విడిచి పాలను గ్రహించు హంసవలెనే పెద్దలు వానిని పరిగణించక సారమునే గ్రహింతురుగాక.

మరిపూడి<br>
తా 22-11-1911

ఇట్లు విన్నవించు తమవిధేయులు<br>
బల్లా స్వామి, అంబటి బాపన్న

# కాశీమజిలీకథలు



| | |
|---|---|
| మొదటవ వాల్యూము | 1—0—0 |
| రెండవ వాల్యూము | 1—0—0 |
| మూడవ వాల్యూము | 1—8—0 |
| నాల్గవ వాల్యూము | 1—8—0 |
| అయిదవ వాల్యూము | 1—0—0 |
| ఆరవ వాల్యూము | 1—8—0 |
| శ్రీకృష్ణబోధామృతము | 0—12—0 |
| శ్రీకృష్ణునిజీవితచారిత్రము | 1—4—0 |
| ఆంధ్రకవులచరిత్రము | 3—0—0 |
| ఆంధ్రకవిజీవితములు | 3—0—0 |
| శబ్దార్థచంద్రిక | 2—8—0 |
| బ్రహ్మాండపురాణము | 4—0—0 |
| స్కాంధపురాణము వచనము | 1—0—0 |
| శబ్దరత్నాకరము | 5—0—0 |

నవలలు

| | | |
|---|---|---|
| పద్మావతి (ఆంధ్రదేశాత్మకమగు చక్కనికథ) | | 1—0—0 |
| సుధాశరచ్చంద్రము (వి॥ ల॥ నరసింహముగారు) | | 1—0—0 |
| ప్రహ్లాద (బళ్లారి కృష్ణమాచార్యులుగారు) | | 1—4—0 |
| ప్రమీలార్జునీయము | డిటో | 1—4—0 |
| పాదుకాపట్టాభిషేకము | డిటో | 1—4—0 |
| ముక్తావళి | డిటో | 1—4—0 |

పై గ్రంథములు వలయువారు:—

మాదేటి సన్యాసయ్య,

బుక్కుసెల్లరు, రాజమండ్రి.

(అని వ్రాసికొనవలెను.

సరస్వతీప్రార్థన,
3 వ కీర్తన—ఆదితాళం.

బ్రహ్మరాణినీవు కరుణజూడుమితల్లీ వాణిరోనీవిపుడు కరుణతోకృపజూడు ॥బ్రహ్మ॥ ధర్మసంవర్థనీకరుణజూడుమాతల్లి నీదాసుడను నేను నీవేగ కరుణింపు ॥బ్రహ్మ॥ కవీశ్వరులపాలి కల్పవల్లియొవాణి వీణెవాణినీవుకరుణించి బ్రోవుమి ॥బ్రహ్మ॥ అందానుగానాదుకావ్యమాదున నీవునిలువవలెనుసుమ్మి కలువరాణియొవాణీ ॥బ్రహ్మ॥ ధరణిలో మర్రిపూడి పురమందు వున్నట్టి రామభక్తులను కరుణజూడుమ తల్లి ॥బ్రహ్మ॥

సీ॥ శ్రీలక్ష్మికరమైన గోదావరీతీర।
రాజమండ్రిలోన బేర్మితోడ।
నీలంబు గలిగిన శివకులమందున
భువిలోన మాదేటి వారివంశజుండు।
సన్యాసయ్యగారు యీరామకీర్తనల్।
రమ్యంబుగా మిగులశ్రద్ధతోను।
విదితంబుగానచ్చువేయించి యిలలోన।
ప్రకాశింపజేసె వేడ్కమీర।
వాసదరహాసకోటి మన్మథవిలాస।
వారికిసిరులిచ్చి బ్రోవుమీనాథమాధ।
పొందుగా మర్రిపూడి పురనివాస।
దనుజ సంహార శ్రీరఘురామచంద్ర॥

రామప్రార్థన
4 వ కీర్తన—ఆదితాళం.

యోవీర నీదయా రాదుర రామయ్యా ఎంతవేడినగాని నీదయ రాదుర ॥యోవీ॥ నామీదనీదయా జూపవేమి రామ నీదయరాకుంటె నేనేమిసేయుదును ॥యోవీ॥ ఆసించి నీకొరకు దోసిలొగ్గితినయ్యా కరుణించి ననుబ్రోవు సంపూర్ణకాముండ ॥యోవీ॥ కరిప్రహ్లాదులను

గాచితివని నేనూ ఆనతో వేసితిని రఘుకులచంద్రుడ ॥యోపీ॥ పతితపావనబిరుదు వహించినవాని ప్రఖ్యాతిగా నిన్ను వేడుకుంటినిస్వామి ॥యోపీ॥ శరణన్నవారిని రక్షించెవాడవు కుండలిశైన ననుకరుణజూడుము స్వామి ॥యోపీ॥ బహువిధములనిన్ను బ్రస్తుతించ మనిబ్రహ్మనానుమాటను వ్రాసెను యీశీరు ॥యోపీ॥ ఆపదనొందగ ద్రౌపదిని గాచిన శ్రీపతినీవునా తాపమార్పగ దేవ ॥యోపీ॥ ఎన్నోవిధంబుల నిన్నెనమ్మియుంటి పన్నగ భూషణ కరుణతో రక్షించు ॥యోపీ॥ నా విన్నపమాలించి నీవేగదయచేసి వాసిగ నల్లాస్వామి దాసునిబ్రోవుమి ॥యోపీ॥

క॥ పాలంగ్రోలి మరాళము
కీలాలమునుజ్జగించి కైగలెడు క్రియ
గాలుని కథ నామాధురి
చాలగ జవిగూడి చెకుగుపరగుననిరుచి॥

శ్రీరాము లక్ష్మణ భరత శత్రుఘ్నుల జననము.

5 వ కీర్తన—ఆటతాళం.

ఉదయించెనదిగో శ్రీరాము డుదయించెగదా ॥ఉద॥ ఉదయించెరమ్మా లోకోద్ధారుడై పదునాలుగు భువనములు పాలించె శ్రీరాము ॥ఉద॥ శ్రీలక్ష్మణ భరతశత్రుఘ్నులు దశరధరాజునకు నలుగురు పుత్రులు ॥ఉద॥ గరుడ గంధర్వాది బ్రహ్మరుద్రాదులు నారాయణునిమూర్తి మిగుల పొగడగ ॥ఉద॥ చైత్రశుద్ధ నవమి బుధవారంబునాడు పునర్వసు నక్షత్రంబున వేడుకతోడ ॥ఉద॥ కర్కాటకాఖ్య లగ్నముసందునా యపుడు కౌసల్యాదేవిగర్భమున రాముసీగనియె ॥ఉద॥ గురువారమునజాలు తరిమీనలగ్నమున పుణ్యాదశదినమున కైకముదముతోడ ॥ఉద॥ పద్మనాభునిహంశా మునభరతునిగనియె కర్కాటకాలగ్న ఆశ్లేష్మమునందు ॥ఉద॥ శావ్యవారమమర ఏకాదశీనాడు విష్ణువంశంబున ముదముతోడుతయపుడు ॥ఉద॥ సుమిత్రాలక్ష్మణశత్రుఘ్నులగనియె ఉదయించగా వేళ తేజ్యముగనె

లిగెను ॥ఉద॥ సురలుఆవేళనూ పుష్పవర్షంబునూ మింటిమీా నుంచిగు
రిపించిరావేళ ॥ఉద॥ గంధర్వులావేళ గానముచేసిరి సురదుందుభులు
మాగెఅందమాగా వేళ ॥ఉద॥ ధరణిలో మరిపురాని పురమందు వెల
సినా శ్రీరాముండాదు ను ఉదయించె నోయమ్మ ॥ఉద॥

విశ్వామిత్రుండు దశరధుని రాముని తనవెంట బంపుమనుట.

6 వ కీర్తన — ఆటతాళం.

దయసేయు శ్రీరాములు। దశరధరాజ। దయాసేయు శ్రీరాములు॥
దయసేయు దశరధ। శ్రీరామ లక్ష్మణులు। దశరాత్రింబులలోనని కొ
ప్పగించెదను ॥దయ॥ సవనంబూ। నేనెపుడు। సేయు నాతింగోనయియుపుడు
రక్కసులు। వేగిరమునవచ్చిన ॥దయ॥ వేదికాలస్పై। రుధిరంబులూ
జల్లి మాంసము న్నెరుపుచు। ఉగ్రములోచ్చి ॥దయ॥ సారెసారెనా
యజ్ఞాము చెరుతురు। వారిముందర నేనూ। ఓర్వలేకున్నాను ॥దయ॥ నా
మీాదదయవుంచి। కరుణించిబో వునా। రామలక్ష్మణులు। దయాసే
యురారాజ ॥దయ గావునవేవేగా। బాహాస్మానుదురించి। లోకవిను
తులుబొందు। శ్రీరామచంద్రుడు ॥దయ॥ వాంపిగాను వరస్ఫూడి పురి
రామచంద్రుడు। దుష్టరాక్షసులెపు। సిగ్గుకుడిలెదు ॥దయ॥ వినావు
వారిని మనుమూ ఎశ్రీరాము। గావుంవేగముగా। కలపిప్పియుంపుమీా
॥దయ॥ కంటికిరెప్పలూ। గామచందంబున। నీసుతులనుగాచి తెచ్చి
యిచ్చెదవినాకు ॥దయ॥

రాముడు విశ్వామిత్రుని యాగముగాచుట.

7 వ కీర్తన — ఆదితాళం.

గాధేయునవనంబూ। గాచెనుశ్రీరాము। యజ్ఞమువిఘ్నము। గా
కుండగావేళ ॥గాధే॥ అప్పుడుమారీచా। విశాలమగువక్షం। భ్రమించగశత
యోజనములు తూలిపడగను ॥గాధే॥ తూలాముచేవాడు। ధరణందుగూ
లేను। ఘనమారుతబాణం। వేసిచంపించెనువాణ్ని ॥గాధే॥ యాగ్నే
యుశాస్త్రంబు। దివ్యవహంబుగదొడగి। సుబాహుమనవడు। బేసేసుమూ

వేళ ॥గాధే॥ నేలమీదాకూలి యన్నగకన్నసులపై నిస్సీమదోశ్శక్తి
తూలాస్త్రమదరించి ॥గాధే॥ ద్రుంచెన్నృప శార్దూలుడు దుర్వారుడై
మిగుల ఆదనుజులనుద్రుంచి విజయమునొందెను ॥గాధే॥ ఆందముగ
మర్రిపూడి పురమందు వెలసినా కౌసల్యాతనయుడు కరుణాసోదుత
యపుడు ॥గాధే॥

రాముడు శివునివిల్లువిరచుట.

౮ వ కీర్తన—ఆదితాళం.

రాజశేఖరువిల్లూ విరిచేమా శ్రీరాముడు జగము మెచ్చగ యాపుడు
ఆనందముతోడ ॥రాజ॥ నాగేంద్రునీ బలిమి బట్టినధంగీరి ధామాన్న.
పాలుడు కోదండముబట్టి ॥రాజ॥ నారులనూబట్టి టంకాన మ్రోగిం
చెవారులుచూడగ ధనువు భగ్నము జేసె,రాజ॥ రామచంద్రుడిటులధనువు
బట్టివిరిగి పుడమినద్దరిల్లి కడుమోదమున మ్రోసె ॥రాజ॥ బయోనిధు
లన్నియునూ కలుకలుబుట్టెనూ మేఘంబులూయపుడు ఘోషించిపో
యెను ॥రాజ॥ రవితారలూరాలె అద్భుతంబూగానూసూర్యుడుచంద్రు
డు తోవంబడప్పెను॥రాజ॥ జనకాధిపుడునూ రామలక్ష్మణులునూ
విశ్వామిత్రుడునూ సంతసించెను ॥రాజ॥ బంగాళనేపాళ మొదలై
న రాజులునూ ఉన్నవారింద్రుకు కడుమూర్ఛనొందిరి ॥రాజ॥ పుడమిలో
మర్రిపూడి నగరమందునయున్న రవికులాబ్ధి రామచంద్రుడు ము
దముతో ॥రాజశే॥

శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నుల వివాహము.

౯ వ కీర్తన—ఆదితాళం.

కల్యాణమూ జేసె దశరథసుతులకు జనకుడియావేళ ఆనంద
ముతోడ ॥కల్యా॥ మిట్టపాదు గునముంచి పందిళ్ళువేసిరి ధరణితోన
మముగ పెళ్ళురుగు లేసిరి ॥కల్యా॥ వీధు వీధుల యందు వీరభో
గముతోటి సందు సందుల యందు సాని భోగముతోటి ॥కల్యా॥
శ్రీరామచంద్రునకు సుగుణా సీలమైన సీతను మోదముతో అం

దంబుగా యిచ్చి ।కల్యా। భరతశతృఘ్నులకు మాలవిశృతకీర్తి యనుకన్యలనిచ్చి కడుమోదముతోడ ।కల్యా। ధరణిలో మరిప్రౌఢి పురమందు వెలసిన దశరధసుతులకు మోదంబుతోయపుడు ।కల్యా।

వ॥ ఇట్లు వివాహములైనవెనుక అయోధ్యాపట్టణముజేరి శ్రీరామునికి పట్టాభిషేకమహోత్సవము చాటించగా కైకేయిపరిచారికయగు మందరయనునది యొక్కసౌధంబెక్కిచూచి యిది శ్రీరామచంద్రుని పట్టాభిషేకము గాబోలు. నేనిది విఘ్నంబు చేయవలయునని తొల్లి కౌసల్యాతనయునిచే దనకు గలిగిన చరణతాడనభంగంబువైరకారణంబుగాగొని యాకైకదగ్గరకు జనుదెంచి యిట్లనియె.

తరళ॥ వినుము కైకా నీవు యిప్పుడు విశదముగా జెప్పెదా
నీసవతి కొమరుడైన రాముకి రాజ్యభారంబిప్పుడు
ముదముతో పురవీధుల మహోత్సవము చాటించెను
సవతితల్లికొడుకు రాముడు సకలభూభాగములకును
అనుభవింపుచుండె యిప్పుడు అకట భరతుడు అతని
యడుగుల బట్టియుండ వలసివచ్చె యేమిజేతునుయయ్యో.

10 వ కీర్తన—ఆదితాళం.

వినవమ్మా కైకమ్మ ।విన్నపంబొకటి॥ చెప్పెద వినవమ్మ వనిత బంగరుబొమ్మ ।విన। దశరధరాజునిను నమ్మియున్నాడని భామరో యీసరికి పొంగుపడుచుంటివి ।విన। అతనికి నీయందు భరతుని యందూను లేశమాత్రమైన ప్రేమలేదమ్మయ్యా ।విన। కౌసల్యాయందును రాముని యందును అధికప్రేమగయుండె దశరధరాజునకు ।విన। రామునికిప్పుడు పట్టాభిషేకంబు చేయుచునున్నాడు యేమిచేయుదమమ్మా ।విన। సవతితల్లికొడుకు శ్రీరామచంద్రుడు సకలభూభాగములు అనుభవింపుచునుండె ।।విన। అకట భరతుడుయధికదీనవృత్తినియుండి అతని యడుగులబట్టి గొలిచియుండవలసె ।విన। దేవాసురయుద్ధములో మెచ్చినీకిచ్చిన రెండువరములు యిపుడు కోరవమ్మా నీవు ।విన। ఒకటవవరమునకు భరతునికిబట్టంబు గట్టింపుమ

నికోరవమ్మా నీవుతల్లీ ॥విన॥ రెండోవరమునకు రాముని అడవిలో తాపసవృత్తిని పదునాలుగేండ్లచట ॥విన॥ పంపించమనిచెప్పు నాతల్లి కైకమ్మా దశరథరాజునకు వేగముగజెపుమీ ॥విన॥ వాసిగమరిప్రూడి పురమందు వెలసిన నరహరినియిపుడు పంపించమనిచెప్పు ॥విన

## 11 వ కీర్తన—ఆదితాళం.

వినవయ్యా ప్రాణేశ నాముద్దుప్రాణేశ నాకోర్కెదీర్చుమీ కోమలాంగహృదయా ॥వినవ॥ తొల్లినీవునాకు జయంతిపురమున మెచ్చియిచ్చినట్టి రెండువరములుయిపుడు ॥విన॥ యిప్పుడీయవలయు నాప్రాణనాథుడ నాముద్దుప్రాణేశ నజునికుమారుడ ॥విన॥ తొలివరమునకు భరతునికిపట్టంబు అందముగాగట్టు నాప్రాణనాధుడ ॥విన॥ ద్వితీయవరమునకు రామునిఅడవిలో నారచీరెలుగట్టి తాపసవృత్తిని ॥విన॥ పదునాలుగేండ్లచట ఫలములనుభక్షించి ఆనతిమాపూర్తయినాక రమ్మనుమిప్రాణేశ ॥విన॥ యిక్ష్వాకువంశమున మహీశులెల్లను పలికితప్పరుస్వామినాప్రాణనాధుడ ॥విన॥ కులధర్మములునీవు జెరుపకుమిప్రాణేశ సత్యమువిడచుట ధర్మమెభూపాల ॥విన॥ బొంకితెరో రాజ నీముందరనునేను ప్రాణమువిడుతును సత్యముసత్యము ॥విన॥ ధరణిలో మరిప్రూడి పురముందు వెలసిన పరమేశ్వరుడునన్ను ఘనతతోరక్షించు ॥విన॥

### రాముడు దశరథ మొదలైనవారికి చింతవలదనుట.

## 12 వ కీర్తన—ఆదితాళము.

పదునాలుగేండ్లునూ పదునాల్గుదినములుగా బుచ్చివచ్చెదనేను చింతింపకుడుమీరు ॥పదు॥ యెప్పుడువలెనీవు సమమాగవర్తింపు వసుధీశనీకింత చింతయేలనూతండ్రి ॥పదు॥ కైకమ్మమీదాను కోపమువద్దుర తండ్రి పినతల్లితోనీవు అనురాగముగవుండు ॥పదు॥ వలగొనితత్పాద వనజంబులకుమ్రొక్కి తండ్రికిప్రణమిల్లి వందనమొనగెను ॥పదు॥ ఆవెంటనేలేచి కైకదగ్గరికెళ్ళి పినతల్లికప్పుడు వందనమొనగెను ॥పదు॥ సౌమిత్రిదగ్గరకు వెళ్ళిశ్రీరాములు సాష్టాంగములుజేసె కోర్కెతోడుత యపుడు కౌసల్యదగ్గరకు అందముతో యేతెంచితల్లికిప్రణమిల్లివందన

మోహన గెన్ను॥పదు॥అమ్మరో మాతల్లి కౌసల్యవినవమ్మ సెలవియ్యవమ్మరో
పోయివచ్చెదను॥పదు॥వాసిగమ్మరిపూడి పురముపరమేశునికి కిరణాయు
ల్లుండెను ఏమిసేయుదునమ్మ ॥పదు॥

క॥ ఇటులని రాముడు చెప్పఁగ
ప్రళయముబోలె మూర్ఛనుఁగ
బొందియు భూస్థలిమీఁద వ్రాలి
తనయుని కిట్లని చెప్పె తల్లియుఁగ.

కౌసల్య దుఃఖించుట.

మత్తకోకిల.

లిప్తనిర్మలభూతి భాసురలేమచూచి విషాదనం
తప్తచిత్తముతోడనిట్లను తనయుడా నినుమోచిని
గుప్తికైకని యెట్టకేనియుగొడ్డుపీగితిసంచునే
సప్తవింశతి వత్సరంబులు సంతసంబుననుండితిఁగ.

తనయా నిను బాసినేనెట్లుయుందురా ఏమిసేయుదునే నెందఁబో త్తురా కొడుకా ॥తన॥ పుత్రికామేష్టిలో పుత్రుడనినుగంటె పరమసంతోషముతో నిన్నుగంటినికొడుక॥తన॥ఎన్నోనోములునోచి నిన్నుగంటిని కొడుకా నానోముఫలమిట్లు పండియుండెర కొడుక ॥తన॥సవతికైకకోర్కె సిద్ధించెరాకొడుక మాయదారికైకమ్మ యెంతపనిజేసెరా॥తన॥నిన్నుబాసితనయా నిముషమూండగలనా మాయదారిబ్రహ్మ నానోము యిటువ్రాసె॥తన॥విపినమునకునిన్ను బొమ్మనకైకకు నోరెట్లయాడెర మాయదరిసవతికి ॥తన॥ తండ్రిసింహాసనము గైకొందువని నేడు ఆసతో యుంటిని నాముద్దుకొమరుడ ॥తన॥ ఏపాపము నేను జేసితినో కాని నేత్రోత్సవము నేను జూడనైతిర కొడుక॥తన॥పుట్టినప్పటినుంచి ఘూదితలక్ష్మిసీత విపినాముమెరుగదు నాతల్లి సీతమ్మ॥తన॥సీతను నీవెట్లు సాకుతావుకొడుక మృగములకు భయపడును వెలదిబంగరుకన్య॥తన॥ నీముద్దు తమ్ముడు లక్ష్మణుడున్నాడు తనయునిగ భావించికాపాడుమీతండ్రి॥తన॥

భద్రముభద్రిము జాగ్రత్త గావేళ్ళి శుభమూనరావయ్య నాముద్ధరి యుడ ॥తన॥ వసుధలో మర్రిపూడి పురమందు వెలసిన పంకజాతునికరుణ మనమీదయిట్లుండె ॥తన॥

క. ఈవార్తకు మునుదైవము
చావ్రసగడె మెట్టిపాపజాతినోనారుగా
బోవ్రనె యిడుమలగుడువం
గావలసిన కార్యమొకటి గలుగగవుత్రా.

క. అంతట రామచంద్రుడును
సీతాలక్ష్మణసమేతంబుగాగా
అడవికియే తెంచెనవుడు చిన్నదనమునగా.

సీత శ్రీరామ లక్ష్మణులు అడవికేతెంచుట.

14 వ కీర్తన—ఆదితాళం.

కౌసల్యాతనయుడు కాననమునకేగె సీతాయు లక్ష్మణుడు ముప్వారుగూడికాని ॥కౌస॥ పినతల్లికయికమ్మరొంతపాపిష్టమ్మ అన్యామెరుగనివారి అడవికిబంపింది ॥కౌశ॥ జటావల్కలంబూలు పొందుగాధరియించి నారచీరలు వారుఅందముతోగట్టి ॥కౌశ॥ గంగదాటీవారుభరద్వాజాశ్రమునకు భరద్వాజమునివరుడు ఫలములందివ్వగ॥కౌశ॥కాంతామణినిగూడి కౌసల్యతనయుడు అందముగచిత్రకూటమునకునేగిరి కౌస॥అంతలో దశరధుడు పుత్రశోకంబున స్వర్గమునకేగెను హాపుత్ర యనుచున్న॥కౌశ।అంతటను వశిష్ఠుడతివేగమునవచ్చి త్వరగానుభరతునికివార్తనంపించె॥కౌశ।భరతుండు ఆవార్తవినగానె త్వరగాను లక్ష్మణానుజానినమేతంబుగాను।కౌశ। వజ్రపురమునుంచి అయోధ్యకేతెంచె రాములేనినగరు శూన్యమయితోచెను।కౌశ। ధరణందు మర్రిపూడి పురమందువెలసిన రామలక్ష్మణ సీత ముప్వారు వెళ్ళిరి ॥కౌశ॥

భరతుడుతల్లిని పట్నంబు శుభంబెడబాసినదని అడుగుట.

గీ. వందనంబులు మాతల్లి వసుమతీశు
నకునుక్షేమమె శ్రీరామునకును శుభమ

సౌఖ్యముగనున్నవాడ లక్ష్మణుడు సీత
కుశలమా తల్లులును సుఖదశలదనర.

వ. ఏమమ్మా యీనగరుచూడగా పరిజాశూన్యంబయి శుభం బెడబాసినటుల దోచుచున్నది ఇదియేమమ్మా.

కైక భరతుని పట్నమేలుకోమనుట.

గీ. వినరనాపుత్రి మీతండ్రి మునుపుయిచ్చినట్టివరములు రెంటినే నర్థినడిగి యొకటినినీకు పట్టంబు యొనరగట్టి యొకటినిరాముని నడవిలో సనుపగాను. వ. నేనుచేసినటువలె సీతాలక్ష్మణసమేతుడయి రాముడరణ్యంబునకు బోయిన పుత్రవియోగ శోకంబున మీతండ్రి స్వర్గగతుండయ్యెగాన ఇంక నిశ్శంకచే రాజ్యభారము పాలింపుముపుత్రా

భరతుడు తల్లిని దూషించుట.

15 వ కీర్తన—అటతాళం.

యెంతపనిజేసితివే కైకమ్మనీవు యెంతమూర్ఖురాలవె। యెంత॥ యెంతపనిజేసితివె మూర్ఖురాలానీవు గాంతారమునకు రామునిబొమ్మావ ।యెంత। నోరెట్లుఆడెనే మూర్ఖురాలనీకు నిన్నేమిజేసిరి కపటయోచనరాలా ।యెంత।·తల్లీవిగావమ్మా రాక్షసివిగాని నీగర్భమునబుట్టిరాముకిద్రోహినైన ।యెంత। పరమపుణ్యాత్మని అడవికిబంపితివికౌసల్యావమ్మలకు దుఃఖమొలదని జెపుదు ।యెంత। విపినాములోరాము జటమూలుధరియించి యుండగపుడమిని ధరించిభోగములు। యెంత। పొందగలనానేను పట్టిమాటలుగాని అన్నను యెడబాసి నిమిషముండగలన యెంత। అన్నమొగముయింక యేతెరంగునజూతు నాచిత్తవృత్తిరిగినాచరితమువిని।యెంత।రామునికి ద్రోహినిగ మనసెంతనొచ్చెనోరామునికినామీద।యెంత। దీనికి సుమిత్రాపుత్రుండునామీద యెంతకోపించెనో యేమిచేయుదునేను।యెంత।మావదినసీతమ్మ యెంతకోపించెనో జనకునికూతురు జననియాసీతమ్మా।యెంత। నీనిమిత్తంబున నన్నిచేటులబుట్టె మాకోనమైనీవు రక్కసివైపుడితివి ।యెంత। యెంతపాపమునకు వడిగటుకుంటివి పాపజాతివినీవు నీమొగముచూడరాదు।యెంత।వసుధ

లో మరిప్రూడి పురమందు వెలసిన నాయన్న రాఘుని నీవు యెంత పనిజేసి
తివె ॥యెంత॥

## భరతుడు చిత్రకూటమునకు వెడలుట.

### 16 వ కీర్తన—ఆదితాళం.

వెడలేను భరతుడు చిత్రకూటమునకు రామునిదగ్గరకు వెడలేనుభరతుడు। వెడ। రాము డున్నస్థలము భరద్వాజునిచేత వేగమున తా నెరిగి రాముదగ్గరకొచ్చె । వెడ। అన్నదగ్గరకొచ్చి దన్నానములను కొట్టి రాఘుపుతవ్వుడు ఆలింగనముజేసె॥ వెడ॥ సుమిత్రానందనకు భూమీశసుతకు సేవ్రిణమిల్లి అప్పుడు వందనమొనగెను॥ వెడ॥ తమతండ్రి పరలోకగతుడయినవార్తను శ్రీరామునకప్పుడు చెప్పెనుభరతుడు। వెడ। చెప్పగవిని రాము మూర్ఛపరవశుడయ్యె జనకరాజపుత్రిసౌమిత్రియప్పుడు, వెడ మ్మృతిబొందినట్లుండి కొంతతడవుకు లేచి శోకాగ్నులు మించుల విలపించ దొడగెను॥ వెడ॥ సీతాయు లక్ష్మణుడు సమేతంబుగాను స్నానంబులను జేసె అందరప్పుడుగూడి ॥ వెడ॥ పుడమిలో మరిప్రూడి రామచంద్రుడు తండ్రికి తిలోదకంబులను విడచె ॥ వెడ॥

## భరతుడు రాముని బ్రతిమాలుట.

### 17 వ కీర్తన—ఆదితాళం.

అన్ననామనవివినుమా శ్రీరామచంద్రుడ నామనవిచేకొని నన్నురక్షించుమీ ॥అన్న॥ నావిన్నపమాలించి నీవేగ దయచేసి ముదముతో అయోధ్య పాలింపుమా యన్న ॥అన్న ॥నీదగుయీరాజ్యలక్ష్మినినేనిపుడు భరింపజాలను మాయన్న రాఘవ ॥అన్న॥ ప్రజాపరిపాలనము పావనలీలాతో భువనభారమునీవు పాలింపుకరివరద ॥అన్న। ధరణిలో మరిప్రూడి పురమందు వెలసిన మత్స్యావతారుడ సాకేతపురమురమ్ము। ఆ రాజ్యభారమునీవు అందముగపాలించి నన్నుకృతార్థునిగ జేయుముమా యన్న ॥అన్న॥

రాముడు సమాధానము చెప్పుట.

18 వ కీర్తన—ఆదితాళం.

యేమిరాతమ్ముడ యిటులాని బల్కెదవు కులధర్మములునీవు విచారింపకుండ ॥యేమి॥ నావంటితనయుడు దశరథంటీదండ్రి సత్యంబుపాలింప కుంటేనుతమ్ముడ ॥యేమి॥ లోకమెల్లుందూను నాముద్దులతమ్ముడా నావ్రతమునిండినక అయోధ్యకొచ్చెదను॥యేమి॥కిన్నర కింపురుషా గరుడగంధర్వాది మొదలైనవారలు రావణునిద్రుంచుటకు యేమి॥ కోరుచున్నారు వాణ్ణిద్రుంచినను వచ్చెద అయోధ్యకెళ్ళుమి తమ్ముడ॥యేమి॥ తల్లిమీదనునీవు కోపముసేయకు నమ్మతితో యుండుమినాముద్దులతమ్ముడ ॥యేమి॥ పుడమిగోమరిపూడి పురవరదుడైనట్టి నరహరిని దలచుచును రాజ్యంబుపాలించు ॥యేమి॥

భరతుండు పాదుకలనుగొని అయోధ్యకేగుట.

క. అన్నా నీవిటుచెప్పుచు
నున్నను నేనేమిసేతు నుర్వీభారం
బెన్నివిధంబుల బూనను
నన్ను కటాక్షించిరమ్ము నరలోకనుతా.

వచనం॥ ఇట్లుఅనగా రాముండు పాదుకలివ్వగా పాదుకలకొని అయోధ్యకువెళ్ళి భరతుండు రాజ్యము పాలించుచుండెను.

రామునికడకు శూర్పనఖ వచ్చుట.

19 వ కీర్తన—అటతాళం.

ఎంతచక్కనివాడవు శ్రీరామచంద్ర ఎంతచక్కనివాడవూ॥ఎం॥ చక్కనివాడవూ రామనృపాలుడా చక్కదనమూజూడ ఎంతోవింతగ యుండె ॥ఎం॥ సోముచంద్రునిబోలు హేమసద్ధాకార యేతల్లికన్నదో హోసుకుమారుడ ॥ఎంత॥నాచక్కదనమునకు నీచక్కదనమునకును యిద్దరకుజోడు కుదిరియుండెనురామ॥ఎంత॥సీతానుయాలనుయుంచుకొనియున్నావు సీతపడిచిపెట్టి నన్నుబొందుమురామ॥ఎంత॥ సీతకోరిన

వస్త్రాభరణములను దెచ్చి యిచ్చెదనీకిపుడు నాకోర్కెదీర్చుమి ॥ఎంత॥ జటావల్కలంబూలు నీకేలవిడువుము కడువేడ్కతోడుత కాంతుడవను పొందు ॥ఎంత॥ ధరణిలోమరిపూడి పురమందు వెలసిన సద్గుణశ్రీశౌరి చక్కనివాడవు ॥ఎంత॥

రాముడు శూర్పనఖను తన్ను వరించకూడదనుట.

20 వ కీర్తన—అటతాళం.

తగున యిటుబల్కదగున దానవినీవు తగునయిటుబల్కదగున తగున యిటుబల్కుటకు న్యాయమదానవి వినుముచెప్పెదనీకుపూబోణియివ్వడు ॥తగు॥ఓ నెశూర్పనఖా నీచక్కదనమును జూచినపురుషుండు నీతోనుసుఖయించి ॥తగు॥ నీతోనురతికేళి బొందకుండుటకు ధర్మంబుకాదు నాకంటెసుందరుడైన ॥తగు॥ నాముద్దుతమ్ముడు లక్ష్మణుండల్లదుగో అతడు భార్యనువిడచి యేకీగనున్నాడు ॥తగు॥ అతనియొద్దకుబోవె ఓ నెశూర్పనఖా పరమసుందరుడతడు సద్గుణసాంద్రుడు ॥తగు॥ వాసిగమరిపూడి పురమూన సామిశ్రీ నీచెక్కిలి కొనగోటచీరి ముద్దాడును ॥తగు॥

శూర్పనఖ లక్ష్మణుని తన్ను పొందుమనుట.

21 వ కీర్త—ఆదితాళం.

ఓలక్ష్మణా వినుమానేను జెప్పెగీమాట తెల్లంబుగావినినాకోర్కె దీర్చుమి ॥ఓల॥ నీమీద నేచాల భ్రమయుంచితినిస్వామి నామోముదీర్చుమి మన్మథాకారుడ ॥ఓల॥ నీయొద్దకూనన్ను వెళ్ళుమనిరామయ్య నాతోనుమీయన్న చెప్పెనులక్ష్మణా ॥ఓల॥ నీయుల్లములోవలనందియుంబువిడిచి శీఘ్రముగనాతోను రతికేళిదేలుమా ॥ఓల॥ రావోయిలక్ష్మణా మరిపూడి వరదపోదుతో నాకోర్కె దీర్చుమిలక్ష్మణ ॥ఓల॥

వ॥ యిట్లని రక్కసిపలుకగ లక్ష్మణుండు విని దానినిబట్టి ముక్కుచెవులుకోయగ శూర్పనఖ కోపించి రావణునితో జెప్పుట.

శూర్పనఖ రామలక్ష్మణులు తనముక్కుగోసిరని అన్నతో జెప్పిదుఃఖచుట.

22 వ కీర్తన—ఆదితాళం.

అన్నరావణవినుమా యేమి సేయుదునేను యేమిసేయుదునేను యింకెటుల బ్రతికెదను ॥అన్న॥ నాముక్కుజూడుమునాయన్నరావణా ఎంతమానమాయె యేమిసేయుదునన్న ॥అన్న॥ అడవిలోయిద్దరూరాజులు రావణ పినతల్లివరముచె వనముకే తెంచిరి॥అన్న॥ దశరథసుతులన్న రాక్షసవధులన్న తడయక యిప్పుడు అడవికే తెంచిరి ॥అన్న॥ వారు నన్నుజూచి నామీదభ్రమయించి కింతుకేళినన్ను రమ్మనిబిలచిరి ॥అ॥ రమ్మనగా నేను రానానిజెప్పితిని నన్నుజూచివారు నామీదగోపించి॥అ॥ నాముక్కుచెవులు ఖడ్గముతో గోసి బోయిరీయన్నతో జెప్పుకోమనిరి ॥అన్న॥ రాముభార్యఅయిన సీతాదేవియనెడు కుసుమకోమలియెంతోచక్కగయుండెను ॥అన్న॥ గావునయారామ లక్ష్మణులవధియించి సీతతోసుఖకేళి దేలుముమాయన్న ॥అన్న॥ ధరణిలోమరిప్రపూడిపుర రామచంద్రుడు నన్నీరీతినిజేసె యేమిశేయుదునేను ॥అన్న॥

శూర్పనఖ సీతను వర్ణించి రావణునితో జెప్పుట.

23 వ కీర్తన—ఆదితాళం.

ఏరియీచెలియకు బోలిన చెలియలు యీలోకములో వెతికిచూచినగాని ॥ఏరి॥ నాతరమవర్ణింప బ్రహ్మకయిననువశమవర్ణించుటకుయవరి వశమన్న రావణ ॥ఏరి॥ లేతవెన్నెలనవ్వు మొగముగల చిన్నది కలువరేకులబోలు కాంతనేత్రంబులు ॥ఏరి॥ చెక్కుళ్ళఅద్దాల తళ్కులనుబోలును మోవిదొండపండు అన్నయ్యరావణ॥ఏరి॥ పలువరుసపగడంపు తీగినిబోలును దంతాలుదానిమ్మగింజలనుబోలును ॥ఏరి॥ పూబోణిపాలిండ్లునారింజపండ్లన్నతమలపాకులబోలు చెలియహస్తములన్న ॥ఏరి॥ సింహామధ్యముబోలు కాంతమధ్యములెన్న అరటిబోదెలబోలు కాంతయూపెనుదొడలు॥ఏరి॥ కామినిసిరుదులు యిసుకదిన్నెలబోలు గడుసుతనంబెన్నగా నెవరివశమన్న ॥ఏరి॥ ప్రకటంబుగ మర్రిపూడిలో నెలకొన్న శ్రీహరికయినను వర్ణించతరమాన ॥ఏరి॥

వచనం॥ ఇట్లు శూర్పనఖ రావణునితో చెప్పగా వినిపదునాలుగువేల ఖరదూషణాది రాక్షసులనంపగా రాముండు వాళ్ళను సంహరించె. తరువాత రావణుండు మాయామృగమును గల్పించగా మాయామృగంబు వచ్చి పర్ణశాలపరిదేశంబున విహరించుచుండగా సీతామహాదేవి దానిని జూచి దానిచర్మంబు కావలెనని కోరగా దానిసదెచ్చుటకయి రాముడు బ్రయాణమైపోవగా మాయామృగము అనేకమాయలచే అల్లిబిల్లిగ నల్లుకొనియున్న పొదలన్నియు దిరిప్పగా రాముడు కోపముగలవాడయి తీవ్రబాణంబుతో డాగివేయగా హాలక్ష్మణాయని మృగముకూలెవాల లక్ష్మణాయనుమాట భూపుత్రివిన్నదై ప్రాణంబులుదిగులొంది లక్ష్మణునితో నిట్లనియె.

సీత లక్ష్మణుని జూడ నెడలుమనుట.

24 వ కీర్తన—ఆదితాళం.

పొమ్మి రామునిజూడుమీ లక్ష్మణ వేగ పొమ్మి రామునిజూడుమీ యీవేళస్వామికీయేమాయజరిగేనో ఆమాయకనకమృగమేల తెమ్మంటినో॥ పొమ్మి॥ మాయసుందరిలేడి మర్మమూదెలియక చింతపడి శ్రీరాము దుఃఖించుచుండెను ॥ పొమ్మి॥ వేసారి శ్రీరాము విపినాములోపల అచ్చట లక్ష్మణా అనివేడుచుండెను॥ పొమ్మి॥ చింతతో శ్రీరాము నేలపైగూలెను సూర్యవేగముదాల్చి చూపైనైతివినీవు ॥ పొమ్మి॥ మనసెంతనొచ్చెనో మతి నెంతతలచెనో కపటాత్మయిదిమనకు కనిపెట్టుకున్నాది ॥ పొమ్మి॥ యే రాక్షసునిచే యేమాయజరిగేనో అడవిలోమనకింక దిక్కెవ్వరూమరది పొమ్మి॥ పుడమిలో ధర్మపురీశుడయ్యినయా రామునినీవిపుడు జూడ వేగమే పొమ్మి ॥ పొమ్మి॥

లక్ష్మణుడు సీతతో రామునికి భయములేదని చెప్పుట.

25 వ కీర్తన—ఆటతాళం.

భయములేదమ్మ శ్రీరామునకు భయములేదమ్మా ॥భయ॥ భయములేదమ్మ రేపవల్ మదిరాక్షిసీతమ్మ అడవిలో రామునికేమిభయ మిక లేదు ॥ భయ॥ అమ్మరో నామాట సత్యంబుగానమ్ము యెట్టిరాక్షసు

నైన రామునికంటెమర ।భయ। నిలువనేర్తుగతల్లీ భయమునొందవల
దు నీయాజ్ఞగానినేను ఈయరణ్యములోన ।భయ। నిన్నువంటిగవిడచి
వెళ్ళితేనుతల్లీ యేమిప్రమాదంబు జరుగునోయనినేను ।భయ। బోవ
వెరతునునేను నత్యంబుగానమ్మ నీభర్త రామునికి యేమిభయము లే
దు ।భయ। ఊరకేనీవిట్లు చింతింపవలదమ్మ ఎవ్వడో రాక్షసుడుయీ
మాయచేసెను ।భయ। శ్రీకరముగ మరిప్రిపూడిలో నెలకొన్న కరిరాజ
వరదునకు ఏమిభయము లేదు ;భయ।

సీత లక్ష్మణుని దూషించుట.

26 వ కీర్తన—ఆదితాళం.

నమ్మరాదెమగవారినెన్నటికైన నమ్మితేమోసంబు గల్గునూ
లక్ష్మణా ।నమ్మ। అయ్యోలక్ష్మణనీకీ యల్పబుద్ధియేల బుట్టెనోలక్ష్మ
ణా ఏమిసేయుదు నేను।నమ్మ। నిన్నుచాలగనమ్మి యున్ననానాధుడు
తెగుటయిప్పుడునిజము నామదికి దెలిసెను।నమ్మ।ఇట్టిసందునీకుజక్క
ననూకోని నన్నుపొందవలె ననియున్నవాడవా ।నమ్మ। ఓహో
హోహొం తెలిసెను నీసాహసంబెల్ల ప్రాణంబులిప్పుడు నిలువతగదు నేను
నమ్మ।తప్పకయిప్పుడీ గోదావరిలోపడి ప్రాణమునీకిపుడు వప్ప జెప్పెద
జూడు ।నమ్మ। ఘనమిగో మరిప్రిపూడి పురయీశు డైనట్టి శ్రీరామచం
ద్రుని సాక్షిగవినవయ్యా ।నమ్మ।

వ। ఇట్లనగలక్ష్మణుండు శివశివాయని చెవులుమూసికొని పంచభూతం
బులను వనదేవతలను సాక్షిగాబెట్టి అన్నవద్దకు లక్ష్మణుండరిగ.

రావణుడు సీతదగ్గరకువచ్చి నీవెవరవని అడుగుట,

27 వ కీర్తన—ఆదితాళం.

ఎవరిదానవునీవు ముద్దుగుమ్మా జెపుమ ఎందుకీవనమునకు ఏతెంచి
తేభామ ।ఎవ। కులమెయ్యదినీది వారిజాక్షీ జెపుమీ యెవనికూతురవు
యిందువదన జెపుము।ఎవ।నీభర్త పేరేమి మామపేరెవ్వరు విశదంబుగా
నాకు విన్నవించవె చెలియ ।ఎవ। యీఘోరవనమందు ఒక్కరితనీవు
సంచరించనికు తగకారణముయేమి ఎవ।చెలియనీపేరేమి జెప్పవూబోణి

హాహా కామినినీది ఎంత చక్కని రూపు ఎవరు విపినములో నిన్ను విడచి వె
ళ్ళినవారు యెవ్వరో నాతోను జెపుమా భామిని ॥ఎవ॥ ధరణిలో మరి
పూరి పురవాసుడైనట్టి శ్రీహరి రాముని భార్యనైతెనన్నావు ॥ఎవ॥

వచనం॥ రావణుండిట్లనిన సీత తన వృత్తాంతమంతయు జెప్పగా విని బలిమితో నిను బట్టుకొని పోవుదునని తీసికొనిపోవుచుండెను.

## సీత విలపించుట.

## 23 వ కీర్తన—ఆదితాళం.

హా రామ హా రామ హా రామ చంద్రా ఏమి సేయుదు నేను యిప్పు
డికేట్లనూ ॥హా రా॥ ధారుణిమీద మీ ధర్మపత్నిని నన్ను దానవు
డొకడు బట్టుకొనియిపుడు ॥హా రా॥ కొనిపోవుచున్నాడు యిట
కు గొబ్బున నీవు తడయక ఏతెంచి దైత్యుని బరిమార్చి ॥హా రా॥ విడి
పించుకొనిపొమ్మా వీరాగ్రగణ్యుడ రవికులాంబుధి సోమ దశరథ తనయుడ
హా రా॥ హా రాజదేవేంద్ర హా గుణసాంద్ర ఏమి సేయుదు నేను యెవ్వ
రు దిక్కు చట ॥హా రా॥ కటకటా యీపైడి మృగమేల నే గంటి పటుగతి
నిదానిపై భ్రమసి రాఘవుని ॥హా రా॥ నేల పొమ్మంటినో పాపిష్ఠనై నే
ను లలితమృగము యెంత పని జేసె రామయ్య ॥హా రా॥ అతిపుణ్యుడైన
యీలక్ష్మణుని చాల దూలనాడితి కటకట ఆద్రోహంబు ఆసన్న ॥హా రా॥
ఏల పోనిచ్చాను ఏమి సేయుదు నేను వృక్షము వదలిన పక్షి రీతి నేనుంటి
హా రా॥ అయ్యో లక్ష్మణా నిన్నా ననరాని మాటలు అనుట చేతనె నేను
అనుభవింపుచునుంటి ॥హా రా॥ స్థిరముగ మరి పూరి పురమందు వెల
సిన హా రామ గుణసాంద్ర విడిపించుకొనిపొమ్మా ॥హా రామ॥

వచనం॥ యిట్లు సీత విలపించుట జటాయువనెడి పక్షి జూచి దశకంఠుని నెదురుకొనగా రావణుండు జటాయువును కొట్టి సీతను లంకలోకి తీసుకు వెళ్ళి అశోకవనమందు ఉంచెను.

## రాముడు సీతేమాయెనని తమ్మునినడుగుట.

## 24 వ కీర్తన—ఆదితాళం.

భూపుత్రి యేమాయెరా లక్ష్మణా వోయి మీవడెనా యెటు బో

కొరా ధిమితకిటతధిగిణత ఆసీతయెటుబోయెరా తమ్ముడ వినుమిజా
నకియెటుబోయెరా ॥భూపు॥ భూపుత్రివిడనాడి నాకెదురువస్తివి మా
యరావణబ్రహ్మ మాయజేసుకువెళ్ళె ॥భూపు॥ భూపుత్రివడిలంక తల
యెత్తిచూడదు భగ్నమైవడిలంక భగ్గుభగ్గునమండ ॥భూపు॥ నట్టడవిలో
సీత విడనాడన్యాయమా తమ్ముడవసిచాలా నినునమ్ముకుంటిని॥భూపు॥
వసిడిలేడినిజూచి పావములాబడెసీతమాయమృగముకూడనే వెళ్ళిపోతిని
భూపు॥ వెన్నెలకు తేటయినా వెలదిబంగరుకన్య పుట్టిల్లైనదలెను అడవి
పాలాయెను ॥భూపు॥ పండువెన్నెలచాయ వెలదిరోఫ్రంబోణీ పురుషు
డెదైవమని వేడుకుంటుండేను ॥భూపు॥ బ్రతుకదు రామాసీతా బ్రహ్మ
యారణ్యములో కారుటవిలో సీతా దుఃఖింపుచుండేను ॥భూపు॥ భూ
పుత్రియాసీతా భూదేవికూతురు జనకునింటనునేను ప్రేమతో దెచ్చి
తిని ॥భూపు॥ మందయానతనా డెందమూలో ఎంత గుందూచునుం
డునేమాలక్ష్మణా ॥భూపు॥ మనలగానక సీతా యెంతోశోకించెనోఏమి
సేతుముమనము తమ్ముడలక్ష్మణా ॥భూపు॥ యెన్నాళ్ళకైనాను సీతా
నుకండ్లాను జూచెదనా నేను తమ్ముడులక్ష్మణా ॥భూపు॥ వసుధలో మ
ర్రిపూడి పురమున సర్వేశ్వరుడు సీతనడవులపాలు జేసెరా దైవంబు
భూపు॥

రాముడు సీతయెదసి లక్ష్మణుని యడుగుట.

30 వ కీర్తన—ఆదితాళం.

యెదయ్యా లక్ష్మణా సీతా పర్ణశాలలో లేదెందు చేత యిదియేమి
యీవింత మధురవాణియు లేదు బెదరిపొదలలో నముగుదడాగినదేమి
యే॥ సఖియని సుఖమెల్ల జూడ సంపెంగ పూబోడినీడ నుదురుచంద్రు
నిబోలు అర్ధరాత్రివేళ పడతినడచినతోవ పండువెన్నెలగాచు॥యే॥
గుణశాలిమీవదిన గున్నమామిడిలాగు జనకూనికూతురు జననిజానకి
సీత యెందుగానరాదు సీత దైవామీరీతీ వ్రాసెనువ్రాత ॥యే॥ వాసి
గ జన్నంపు పేటలోనున్నట్టి మావూరియిప్పన్న మదిని దలచుచునుంట
యెదయ్యా॥

## రాముడు సీతనుగానక విలపించుట.

### 31 వ కీర్తన—ఆదితాళం.

హాసీత యెటుబోతివో జానకినీవు హాసీత యెటుబోతివో॥హాసీత॥ సీతా యెటుబోతివో ఏమి సేయుదును ఏమి సేయుదు నేనేను ఏలాగుతాళుదును ॥హా॥ వొంటిగ నన్నువిడచి నలినాక్షినీవు జనుట ధర్మమా లలితాంగి బూజాలివో సీత ॥హా॥ వెలదినీకొరకునే హరువిల్లువిరచితిపరశురామునిప్రజ్ఞ భంగపరచితినేను ॥హా॥ నీకుగాయీరెండు వింధేలుజగతిని పాలింపె చెనలినాక్షి నిన్ను నమ్మియుంటి ॥హా॥ కమలాక్షినీవులేని కమరత్నమిక నేల భామినినీవులేని జీవమిక యేలాను ॥హా॥ పూబోణి నినుబాసి నిమిషముండగలన మృగమధ్య నినువిడచి యేరీతినుందును హా॥ప్రాణములాకంటె ప్రియమగుటసీత ప్రాణేసినినుబాసి ప్రాణంబులా తోను॥హా॥క్షీణదశ చే నేను బ్రతికియుండుటకంటె ప్రాణమువిడుచుట భద్రమునాకింక ॥హా॥ ఏమ యితివోనీవు తెలియ లేనయితిని తెలియలేనైతిని నినుగాన లేనైతి ॥హా॥ నీవేనడచినత్రోవ పందువెన్నెలగాచు ఏత్రోవ వెళ్లితివో హామదగామిని ॥హా॥పయిడిమృగముయనిభ్రమసినీ వడుగంగ నీదుకోర్కెదీర్పగను చబోయినేను ॥హా॥ నిన్నుగోల్పోతిని, ఏమి సేయుదు నేను యీదుఃఖవారిధిని మునుగుచుంటిని నేను॥హా॥ధరణిలో మరిపూడి పురపర మేశ్వరుడు నిన్నుఅడవులపాలు జేసె నేమి సేదు ॥హా॥

వచనం॥ శ్రీరామునిట్లు విలపించుచున్న సమయమున జటాయువుండు యీవృత్తాంతమంత రామునితో జెప్పగా వినిన అంతట జటాయువుండు మృతిజెందగా జటాయునకు అగ్నిసంస్కారములొనర్చితగక్రియలన్ని జరిపి శబరియిచ్చినపండ్లను భక్షించి వృక్షాదిరియందు హనుమంత మొదలగువార్లను గని కిష్కింధకే తెంచి వాలినిజంపి సుగ్రీవునకు పట్టంబుగట్టి సీత జాడలుచూచుటకు వానరులను బంపించుటకు ప్రయత్నము జేయుచుండె.

## సీత రామునికోసము దుఃఖించుట.

### 32 వ కీర్తన—అటతాళం.

ఇక రామునికండ్ల జూచెనా నేను ఈ చెరలోనుంచి వెళ్ళేనాలకట

విభుడు నన్ను నాడు మరిచెనే మొ ఒకరింటనేనిప్పుడున్నాదియెరుగాడు॥ఇ॥ నన్ను పెండ్లాడిన రాముడు యేలనాజాడలోకిరాకున్నాడు ఎన్నడునాకౌగిలెడబాసియుండడు పన్నుగ నేటికిపదినెలలాయెను॥ఇక॥నాముద్దులామతది లక్ష్మణానీతో తామసపడితినిసద్గుణ నామాటలెన్నగ నాటినొచ్చెనునీకు వేమారుదూరనుగ విడిచిపోతివినన్ను॥ఇక॥హారఘువీరనిన్నాసితీ నిద్రహారాలుమొదటికిరోసితీ కోరుచున్ననీపురుషదేహము శృంగారముగకండ్లగప్పినట్లున్నాది॥ఇక॥ఈవిరహమునకెట్టులోర్తును రాము నెప్పుడుకౌగిటజేర్తును భావజ్ఞుడయిన నాపతిపాదములుబట్టి చేతులనిండచెయ్యనెనోచెన॥ఇక॥కారుణ్యమైనవారెవ్వరుశ్రీరాములదెచ్చువారెవ్వరు ఈరాక్షసుడునన్ను యిటుదెచ్చినవార్త వారితోదెల్పెటివారెవ్వరున్నారు॥ఇక॥పూనిధ్యానింతు నాస్వామిని ధర్మశ్రుతినరహరియైనశ్రీరాముని నానోముఫలమింక నెన్నాటికీడేరు భానువంశజుడిందు పయనమైరాడేమొ ॥ఇక॥

శ్రీరాముడు హనుమంతుని లంకకు వెళ్ళగమ్మనుట.

33 వ కీర్తన—ఆదితాళం.

వేగమెరమిమ్మ ఆలంకకు శీఘ్రమె వెళ్ళుము వేగమెరమ్మవెళ్లుమి లంకకుక్షేమముజెపుమ వాయుతనూభవ ॥వేగ॥ లంకకువెళ్ళింతిస్సీని జూచిజంకులేక ఉంకించిరాటుమి॥వేగ॥ముద్దుటుంగరము ముదితకు నీవిమ్ము ముందుగ రావణుదృంచెననుమీ ॥వేగ॥

శ్రీరాముడు సీతజాడలు జూడమని ఆంజనేయుని బంపుట.

34 వ కీర్తన—ఆదితాళం.

సీతజాడలుజూడుమా అంజనిలోక మాతజాడలుజూడుమా॥సీ॥ ఖ్యాతిగనివేగిసీతాక్షేమముజూచి జేతామునకుజేరి బాతినంతయుదెల్పు సీత॥ మాయవేషములచే మరినిన్నురాక్షసులు మనమునాటించుతుగుమరచివడబడకేగ॥సీ॥వానరోత్తమలంక వకనూరామడగలదు వారాధిదు గూగినుమావడిగ జనియునీవు॥సీత॥ఆలంకపురమంత అందమైయుండును అదిజూచిమురువాక హరిపతినిగైకొమ్ము ॥సీత॥ ధరణిలోపుగటూరి

వరకేశవుని చాల నిరతాము నీమది మరిమరి దలచుచు ॥సీత॥ ఇనవంశ కాంతము వరశరధీశుని నేలే హరిసుతము మదినిల్పి సరసిజాక్షి చూడు ॥సీ॥

హనుమంతుడు జాంబవంతాదులతో సీతను వెదుక వెళ్లుట.

35 వ కీర్తన — ఆటతాళము.

శ్రీమంతుడైనట్టి శ్రీహనుమంతుడు సీతను వెదుక సాగెను స్నేహితులతో ॥శ్రీ॥ అతిరూపవంతుడు అంజనితనయుడు ఆమహేంద్రము నెక్కెను స్నేహితులతో ॥శ్రీ॥ కొండపై చరియింప రెండవ సూర్యునిరీతి నుండి వెల్గందెనయ్యా ॥శ్రీహను॥ దండిగ హనుమంతుడు దాటనూకించగ కొండ జవజవలాడెను ఆనమయమున ॥శ్రీ॥ వింతైన బంగారు బంతిరూపున హనుమంతుడు పోవుచుండె ఆసమయమున ॥శ్రీ॥ మున్నీటిసదుము నుసుందరమైనాకమును జూచి కాళ్యాది ఘనముదూలోచించి ॥శ్రీ॥ శ్రీరాముని సేవ జేసినవారికి మరణము లేదనిబల్కుచు హనుమంతుడు ॥శ్రీ॥ లంకాకైనుగై వార్ధిలంఘించదలచియు శంకయించుక లేక చరములుజోడించి ॥శ్రీ॥ కుప్పించి హనుమంతుడు ప్పరంబున కెగయ అప్పుడెడుప్పొంగెనుఆ సాగరము ॥శ్రీ॥ సువేలాద్రికిబోయి సుఖముగనుండగ సూర్యుడస్తమించె చుక్కలుగనుపించె ॥శ్రీ॥ దేవతులెత్తిన దీపంబుకైవడి దివినిచంద్రుడు వెల్గెను ఆసమయమున ॥శ్రీ॥ లంకదేవిడివద్ద లంకిణినిజూచి పోంకమణీగించెనయ్యా ॥శ్రీ॥ ఆలంకలోపల అతిచిత్రములుజూచి ఆనందమొందెనయ్యా ॥శ్రీ॥ గొప్పైన మేడలు గోపురంబులు మొదలు అవిచాలజూచెనయ్యా ॥శ్రీ॥ వజ్రములు చెక్కిన వరమైన శ్రేణిలు ఆవిచాలజూచెనయ్యా ॥శ్రీ॥ పగడంపు తిరిగోళ్ళు పట్టిమంచములపై నిద్రబోవుచునుండిరి రాక్షస స్త్రీలు ॥శ్రీ॥ కల్లునుమాంసమును పెల్లుగభక్షించి ఒడలుతెలియక యుండిరి రాక్షసస్త్రీలు ॥శ్రీ॥ ఒడలు తెలియక స్త్రీలు పడుకున్న సమయమున చన్నులు వెన్నులు చంకపొక్కిళ్లును ॥శ్రీ॥ తొడలు మెడలుబయలు పడగజూచియు గుండె ఝల్లనిచింతించెను శ్రీహనుమంతుడు ॥శ్రీ॥ రాముదేవిని వెదుక రాత్రివచ్చితి నేను ఈపాపమునుజూచితి శ్రీహరిరామ ॥శ్రీ॥

ముక్కుడిముండ యెటుబోయె బోడగనుపించ దెక్కడదాచితివృదానివై,
కాననమునసంచరించగా వారిని ఖరదూషణులెదిరించగా దానవులను
జూచి ధైర్యముతో నిలచి తానొక్కడెద్రుంచెదండిశూరుడు రాము॥వై॥
లవణసముద్రము దాటడవచ్చి లంకనుకోనగోటమీటడ భువనాపాలు
డు రామకరిపురిధాముపు రవికోటితేజుడు రామచంద్రులగుర్తు ॥వెరుగ॥

41 వ కీర్త—ఆటతాళం.

రాముభార్యనురా రావణవినర రాచకన్యనురానీతలద్ర్యంకలో
కమాతనురా నన్నంటకు రాచకన్యనుతా ॥రా॥ భూపతులు మెచ్చగ
శివునివిల్లువూనిఖిరువగను ఆపదమునన్ను పెళ్ళాడినట్లుగ సీతమహాతి
శేషగిరి దానవరుడైన॥రా॥వాలినెరుగవురా నిన్నెనప్తసాగ్ధులముంచెను
అటువంటివానిని ఒక్కశరమున ద్రుంచివాలితమ్ముని పట్టమేలించినర
ఘు ॥రా॥ తాటకిని ద్రుంచెను నీకొత్కై యాతారములుదాల్చెను వా
లాయముగ విశ్వమిత్రి యాగముగాచి రాతిని నాతిగజేసిన శ్రీరఘు
రాము, మారీచమాయలేడిని పంపియునన్ను చోరననుదెచ్చితివి ఉం
డదు నీలంక దగ్ధమైపోవును పండంటినీలంక పాడైపోవునునమ్ము ॥రా॥
తొల్లినీలంకలోను రావణ వినరనీతోడబుట్టితిని తోచదబరనీకుదుర్మా
ర్గకులర ఆచక్రిధరుని శరణనరమనవినర ॥రాము...నురా॥

సీతారావణుల సంవాదము

42 వ కీర్తన 35 వ కీర్తన శేషము

పణతిరోనాకోర్కె బాగుపరచితెనిన్ను పట్టంపుదేవిగజేతునా
ఓసీత॥ అనిరావణుడుబల్క తృణముచేతనుబట్టి కోపించిపల్కెనయ్యా
సీతాదేవి, కోపించిపల్కెనుకొమ్మా సీతాదేవి పాపాత్మనీవు నీబంధువు
లతోడను మృతిబొందుటకునీవు మతిలేకపల్కెవె బుద్ధినాలోచించరా
ఓరావణ। అనిపల్క రావణుడు అప్పుడుకోపించి తిరిగిలంకకుబోయెను
పాపాత్ముండు॥ కావున్నవారలు కాంతను భయపెట్టి కరువనాగిరి కొంద
రు ॥సీతమ్మను॥

త్రిజటకలగని సఖియలతో జెప్పుట.

43 వ కీర్తన—ఆదితాళం.

కలగంటినోయమ్మ కలగంటినే చెలి కలలో శ్రీరాములురాగ కలగంటిని॥కల॥ కారుణ్యముగ లక్ష్మణుడు వెంబడి రాగ చారుగజము నెక్కి శరచాపములుబూని లంకకు యిప్పుడు వచ్చినట్టుగ నేను ॥కల॥ మురయుచు నే తెంచె తెల్లనివస్త్రములు శోభిల్లగ దాల్చి ధరణిజనుగూడి వుత్తరదిక్కువారుకపులుబోయి శ్వేతగిరిమీదను నిలుచుండెవారంత॥క॥ పొందుగ రావణుడు పుష్పకమెక్కియు భూమిపై బడునట్లుగంటినే ప్రాయమ్మ మందిరావణుగూల మనరాక్షసులు వెడలి అందరుయిప్పుడు దక్షిణకుబోయిరి॥కల॥ వెడలెకుంభకర్ణ లొట్టిపిటనెక్కియు వెడలెఘనకాయుడు ఇంద్రజిత్తుడు మొదలుగా గలవారలు నూనెతలతోనుగార్ధభములనెక్కి వెడలెలంకలోనూడి॥కల॥ చెలగిమిత్రులుగొల్వ అతివైభవముతోడ సుందరముగ స్త్రీలు పుష్పములుచల్లగ ఎలమితో తెల్లని ఏనుగపైనెక్కిఘనవిభీషణుడు రాముసన్నిధికి జేరెను॥క॥యిక సీతమ్మకు జయము రావణునికపజయము ధరణిమురిపూడి పతియైన రాములు సకల శుభములతోడ జానకిని కూడును ॥కలగంటి॥

సీత శోకించుట.

44 వ కీర్తన—ఆదితాళం.

ఎంతో శోకించిన యెవరుగావరారు చింతాబ్రతుకేలనమ్మా త్రిజటనాకు ॥ఎంత॥ చిన్ననాటనుండి శ్రీరాముపిడువక పేర్మితోనుంటిని భామరో యీనరికి॥ఎంత॥ కైకవరమున మేముగారుటడవులకేగి కష్టపడి యుంటిమి గాంతరో యీనరికి ॥ఎంత॥ ఆరుమాసములాయె ఆరాము నెడబాసి నిద్రాహారము లేదు నెలతరో యీనరికి॥ఎంత॥ చింతేలనోయమ్మ శ్రీరామ్ముతెల్లరుగో వార్ధిదాటి వచ్చెవనితరో చూడుము॥ఎంత॥ ధరనుమ ౹రిపూడిపురధాముడుస్వామి దాసునికృపజూచి దశరాధరాములు॥ఎం॥

హనుమంతుడు సీతతో రామునివృత్తాంతము జెప్పుట.

45 వ కీర్తన ఆటతాళం.

పల్కెనసుమంతుడు సీతమ్మకు తెలిసెటట్టుగనప్పుడు బలువైన

